ౕ

28.12.2012

ప్రియమైన సంపత్‌కు,

కుసుమహారలతో.

ఎందుకో ఈ రోజు మీకు నా ప్రారంభ దైవజీవతం గురించి వ్రాయాలని అనిపించింది. దీనిని మీరు ''How Haranath came into our family,'' పుస్తకంలో చదివి ఉండవచ్చు. నా ప్రారంభ దైవజీవితం గురించి తెలుగులో మీకు వ్రాయాలని సంకల్పం కలిగింది.

అవి ఇంజనీరింగ్ మొదటి సంవత్సరం పరీక్షలకు సిద్ధమవటానికి శెలవురోజులు. మార్చి 1954. నా కాలేజి అనంతపురంలో ఉండేది, మా అక్క మునిసిపల్ మెటర్నిటి మెడికల్ ఆఫీసర్‌గా గుంతకల్‌లో పనిచేస్తుండేది. చదువుకొనటానికి నేను ఆమె ఇంటికి వెళ్ళాను. ఆమె వద్ద ఉపదేశామృతం పుస్తకం ఉండింది. ఎందుకో ఆ పుస్తకం తెరిచాను. అంతే, ఇక నా పాఠ్యపుస్తకాలను ముట్టుకోలేదు. ఆమె ఇంటిలో ఉన్న పదిరోజులూ ఉపదేశామృతాన్ని మాత్రమే చదివాను. ఇది నాకు ప్రభుని సందేశానికి ప్రమాణంగా నిలిచింది, ''నా వారిని నేనే ఎన్నుకొనెదను.'' చిన్నతనం నుండి నా తల్లి ప్రోత్సాహంతో నామం చేస్తున్నా, భజనలలో పాల్గొంటున్నా, ఆకర్షణ మార్చి 1954లో మాత్రమే జరిగింది.

ఒకరోజు రాత్రి స్వప్నం కలిగింది. ఒక హాలు, అందులో చివరిలో చెట్టుక్రింద బాబా పటం ఉంది. అక్కడికి వెళ్ళాలనే ఆవేదన. అయితే ముందు రెండు అడ్డుగోడలున్నాయి, వాటి మధ్యగుండా వెళ్ళాలి. ఆ గోడలమీద క్రూరమైన వానరాలు(1) గర్జిస్తూ అటూ ఇటూ దూకుతున్నాయి. ఎలా వెళ్ళడం? నేల మీద పరుండి, ప్రాకటం(2) మొదలెట్టాను. నేరుగా ప్రభుని పటం చేరుకున్నాను. పటంలో ప్రభువు మెదిలాడు, తన చేతిని ఊపుతూ అన్నాడు, ''ఇప్పుడు కాదు, తరువాత.'' స్వప్నం విచ్చిపోయింది.

నిద్రలో అంతర్ మనస్సు, మన అధీనంలో కాకుండా సంచరిస్తూనే ఉంటుంది, కాబట్టి స్వప్నాలకు నేను అంత విలువనివ్వను. అయితే ఈ స్వప్నం దైవసందేశంలా నాలో స్థిరంగా ఉండి పోయింది. ఇప్పుడు నాకు కలుగుతున్న అనుభవాలతో పోల్చి చూస్తే, ఆ స్వప్నమే వీటికి నాంది అని స్థిరభావం ఏర్పడింది. ''మన సంబంధమనాది సిద్ధమని, మన సహవాసమనంతమనీ,'' అన్నదానికి నా దైవజీవతం ప్రారంభమే నిదర్శనం. అందుకే నేను ఖచ్చితంగా చెబుతుంటాను, భగవంతుణ్ణి మనం కాదు అన్వేషిస్తున్నది, భగవంతుడు మనల్ని అన్వేషిస్తున్నాడు అని. దీనిని మూలంగా ఉంచుకొని మనం ఇతర విమర్శనలను చేసుకోవచ్చు. రమణమహర్షి అన్నాడు కదా, ''మనకు దైవ చింతన కలగటం, అది దైవకటాక్షం,'' అని.

(1) ప్రాపంచిక జీవితం క్రూరమైన వానరాల సదృశంగా ఉంది (మాయ వశంగా ఉంది.)

(2) ఈ క్రూరమైన వానరాల నుండి (మాయ వశం నుండి) తప్పించు కొనటానికి మనం మిక్కిలి గుప్తంగా ఉండాలి. ప్రభువు మనకు ముసలిది-దొంగ ఆటను ఉపమానంగా ఇచ్చాడు కదా! జదుపతికి వ్రాసిన లేఖ (4వ భాగం; 70వ లేఖ):

'' నా ప్రభువు జగతిని సంసారంగా చేసుకొని క్రీడిస్తున్నాడు. ఆయన ముసలిదాని పాత్రను వహించి కూర్చున్నాడు, మాయను దొంగగా నియమించి మనతో ఆడుతున్నాడు. ఎవరైనా ముసలిదానిని ముట్టుకోగలిగితే మాయ అతణ్ణి ముట్టుకున్నప్పటికీ అతడు దొంగకానక్కరలేదు. మనం ముసలిదానిని ముట్టుకునేందుకు ప్రయత్నం చేస్తే, మాయ మనలను అడ్డగిస్తున్నది, మనం నాల్గుదిక్కులకు పారిపోతున్నాం. ప్రభుని శక్తితో మాయ శక్తివంతంగా ఉంది. అందుకే ప్రభువు గీతలో (అ-7; శ్లో-4) ఈ మాయను ''దురత్యయా'' అని చెప్పాడు (జయించటం దుర్లభం). **ఈ మాయ బారినుండి తప్పించుకోవాలని అనుకునే వారు చాల గోప్యంగా నడుచుకొని మాయదృష్టిలో పడకుండా జాగ్రత్తపడాలి. జడభరతుని కథ దీనినే మనకు తెలుపుతూ ఉంది.** మాయాతీతులైన మహాపురుషుల ఉపదేశాలను అనుసరించే వారుకూడ మాయబారి నుండి తప్పించుకోగలరు. ఈ క్రీడను ముసలిదాని ప్రక్కనుండి తిలకిస్తే వేడుకగా ఉంటుంది, లేకపోతే అలిసిపోతాం. సంసారాన్ని విసర్జించినంత మాత్రాన ఏమీ సాధించలేం. ఆయన ఈ బ్రహ్మాండాన్ని ఈ విధంగా నాటకరంగం చేసి క్రీడిస్తున్నాడు.''

(ఇంకా ఉంది, కాని ఎప్పుడు ముగించగలుగుతానో తెలియదు.)

సేపూరి హరగోపాల్

* * * * * *

29.12.2012

ప్రియమైన సంపత్‌కు, కుసుమహారలతో.

## ప్రభునితోటి నా అనుబంధం

### రెండవ భాగం

నేను అనంతపురం ఇంజనీరింగ్ కాలేజిలో రెండవ సంవత్సరం (1954-55) హాస్టలులో ఉన్నపుడు, ఒకరోజు మధ్యరాత్రి అకస్మాత్తుగా మెలకువ కలిగింది. నేను ప్రభువును ప్రార్థించాను, ''ప్రభూ! నీవు నన్ను పర్యవేక్షిస్తున్నట్లు నాకు ఇప్పుడే ఏదైనా నిదర్శనం చూపించు,'' అని. ఇది అకస్మాత్తుగా ఏ పూర్వపు ఆలోచనా లేకుండా జరిగింది. నేను ప్రభువును ఆవిధంగా ప్రార్థించటం ప్రభువు జతీంద్రనాథ్‌కు వ్రాసిన ఉత్తరంలోని సందేశ ప్రభావమై ఉండాలి.

(పా.హ: భాగం-2; లేఖ-13) : ''విశ్వాసం స్థిరపడటం కోసం ఆయన నుండి ఒకటి రెండు ప్రాపంచికమయిన వాటిని కోరుకో. ఆయన నుండి మనం కోరుకున్నవి లభిస్తాయని తెలుసుకున్న తరువాత ఆయన నుండి ప్రాపంచిక వస్తువులను కోరవద్దు. ప్రేమ భక్తి తప్ప ఆయన నుండి వేరే ఏదీ కోరవద్దు.''

వెంటనే దీనదయాళుని చిత్రం నా కళ్ళముందు నిలిచింది. కళ్ళు మూసుకొనే పడుకొని ఉన్నాను. ఎంతో దేదీప్యమానంగా, స్పష్టంగా కనిపించింది ఆ చిత్రం. బహుశ ఐదు సెకండ్లు నిలిచి ఉండవచ్చు. ప్రభువుకు నా మీద ఎంత అనుగ్రహమో! ఆవిధంగా ప్రత్యక్ష ప్రమాణం నాకు చూపించాడు. నిశ్చయంగా ఇది అర్హతను బట్టి కలిగిన అనుభవం కాదు.

''మన సంబంధమనాది సిద్ధమని, మన సహవాసమనంతమనీ,
మనకు వియోగము అసంభవమని చెప్పిన వాడవు కావా ప్రభువా.''

ఇంతకంటె నిదర్శనం కావాలా? మనం ప్రభువును అన్వేషిస్తున్నామా, లేదా ప్రభువు మనల్ని అన్వేషిస్తున్నాడా? మీరే ఆలోచించి చూడండి, మనం చేయగలిగింది ప్రభువుకు అర్పణమై పోవటమే.

సేపూరి హరగోపాల్

* * * * * *

# ప్రభువుతోటి నా అనుబంధం

## మూడవ భాగం

నేను అనంతపురంలో ఇంజనీరింగ్ కాలేజిలో చదివే రోజులలో భారతదేశంలోని విద్యుత్ కేంద్రాలు, సేతువులు, టాటా ఇనుప పరిశ్రమలు లాంటి బృహత్ నిర్మాణాలను తిలకించటానికి విద్యార్థులకు ఒక టూర్‌ను 1956 చివరిలో ఏర్పాటు చేశారు. మాకు మార్గదర్శకంగా ఒక అధ్యాపకుణ్ణి పంపించారు. ఆయన పేరు రాఘవన్. పూనా, బొంబాయ్, సంబాల్‌పూర్, టాటానగర్‌లు తిలకించి హౌరా చేరుకున్నాం. అక్కడి పరిశ్రమలను తిలకించి వాల్తేరుకు హౌరా–మద్రాస్ మెయిల్‌లో బయలుదేరాము. మా అధ్యాపకుడు రైల్వేవారి సహాయంతో ఒక రైలుపెట్టెను అనధికారపూర్వకంగా స్వాధీనం చేసుకున్నాడు. స్లీపర్లు లేని కాలమది. దొంగలుంటారు కాబట్టి ఎవ్వరినీ రైలుపెట్టెలోకి అనుమతించవద్దని మా అధ్యాపకుడు అందరినీ ఆదేశించాడు. రైలు రాత్రి ఎనిమిది గంటలదాపుల్లో బయలుదేరింది. కొందరు బెంగాలీలు రైలుపెట్టె తలుపు ఊచలను పట్టుకొని నిలబడ్డారు. ఆ పెట్టె రిజర్వు చేయబడిందని మేము వారిని హెచ్చరించాము. ఒక్కరు తప్ప తక్కినవారు దిగిపోయారు. రైలు ఖర్గపూర్ చేరుకొనడానికి రెండు గంటలు పడుతుంది. శీతకాలము, చలి అమితంగా ఉంది. బయట ఊచను పట్టుకున్న వాడు చలికి ముడుచుకొని పోతాడు. అధ్యాపకుని ఆదేశాన్ని మీరి ఆవ్యక్తిని లోనికి అనుమతించటానికి లేదు. కొంతసేపటికి అందరూ పడుకున్నారు.  మా అధ్యాపకుడు సామానుల అటకమీద పడుకున్నాడు. నేను నేలమీద హోల్డాలు పరిచి పడుకున్నాను.

కొంత సేపటితరువాత నేను మెల్లగా లేచి తలుపు తీసి ఆ వ్యక్తిని లోనికి ప్రవేశపెట్టి తిరిగి నా ప్రక్కమీద కూర్చున్నాను. ఖర్గపూరులో అతడు దిగిపోగానే గడియ పెట్టదలచి నిద్రపోకుండా కూర్చున్నాను. ఒక గంట తరువాత నా దురదృష్ట వశాత్తు (అది నిజంగా నా అదృష్టమే) అధ్యాపకుడు మూత్రవిసర్జన కొరకు నిద్రలేచి అటక దిగివచ్చాడు. రైలు పెట్టెలో క్రొత్త మనిషిని చూసి ఉగ్రుడైపోయాడు. "ఎవరీతణ్ణి లోనికి ప్రవేశ  పెట్టింది," అని కేకలు పెట్టటం ప్రారంభించాడు. బాక్సింగ్ రింగులో ఉన్న మల్లునిలాగ ప్రవర్తిస్తున్నాడు. విద్యార్తులందరూ మేల్కొన్నారు, భయంతో ఎవ్వరూ నోరుతెరువలేదు. నేను నా పడకనుండి లేచి అధ్యాపకునితో విన్నవించాను, "సార్, నేనే అతణ్ణి లోనికి ప్రవేశపెట్టాను," అని. వెంటనే అధ్యాపకుడు ఆదేశించాడు, "వెంటనే అతణ్ణి బయటికి వెళ్ళిపొమ్మను," అని. నేను విన్నవించుకున్నాను, "సార్, రైలు వేగంగా పరిగెడుతుంది కదా, ఆయన్ని ఎలా బయటికి వెళ్ళమని చెప్పగలను," అని. ఆయన ఆవేశంగా అన్నాడు, "ఆయన్ని బయటికి వెళ్ళమని చెప్పలేకపోతే, నీవు బయటికి వెళ్ళిపో (get out)."

దీనితో నా సహనం తెగిపోయింది, ప్రతిఘటించి అనాలోచితంగా అనేశాను, "ఇది మీ తాతసొమ్మేమీ కాదు, నన్ను బయటికి పెళ్ళమని అనడానికి." ఇది ఆయన ఆవేశం మీద నీరు చల్లినట్లు వర్తించింది, కానీ ఆయనలో ఒక వ్యధ పొడచూపింది. "ఏమీ, ఇది నా తాత సొమ్ము కాదా," అని పలవరిస్తూ మెల్లగా తన పడక మీదికి ఎక్కి పడుకున్నాడు. కొంత సేపటి తరువాత ఖర్గపూర్ స్టేషన్ వచ్చింది. ఆ వ్యక్తిని బయటికి పంపించి, తలుపు గడియబెట్టి వచ్చి నా పడకలో పడుకున్నాను. ముసుగు కప్పుకొని కన్ను మూశానో లేదో, పద్మాసనం బాబా వదనం స్పష్టంగా కనిపిస్తూ ఉంది. ఆయన కనుబొమలు బాధతో ముడుచుకొని ఉన్నాయి. నా హృదయం క్షోభించింది, ప్రభువుకు బాధ కలిగించానే అని. ఆ సందర్భంలో నా ప్రవర్తన సమయోచితంగా ఉండి ఉండ వచ్చు, కానీ అది భక్తుడుగా ఉండదలుచుకున్న వ్యక్తి ప్రవర్తించ వలసిన తీరుకాదు. అధ్యాపకుణ్ణి అన్య వ్యక్తి ముందు, పలు విద్యార్థుల ముందు పరాభవించటం జరిగింది. నిద్ర పట్టలేదు. తెల్లవారు జామున అధ్యాపకుడు నిద్రలేచి ప్రక్క మీద కూర్చున్నాడు. నేను వెంటనే లేచి ఆయనకు విన్నవించుకున్నాను, "సార్, నిన్న రాత్రి నా ప్రవర్తనను తలుచుకొని నేను సిగ్గుపడుతున్నాను. దయచేసి నన్ను కమించండి," అని. ఇది నిజమా అని ఆయన నమ్మలేక ఆశ్చర్య పోతున్నాడు. "అదికాదు . . ." అని ఏదో చెప్పబోయాడు. నేను ఆయన పాదాన్ని ముట్టుకొని మరల వేడుకున్నాను, "సార్, నేను నిజంగా పశ్చాత్తాప పడుతున్నాను, దయచేసి నన్ను కమించండి, సార్," అని. నాలోని సదుద్దేశ్యాన్ని, తహ తహనను ఆయన గ్రహించ గలిగాడు, "ఓ.కే," అని అనేశాడు. అంతే నేను పడక మీద పడుకొని రైలు వాల్టేరు చేరుకున్న తరువాత నిద్రలేచాను (మధ్యాహ్నం పన్నెండు గంటలకు).

ఇది ప్రభువు నిర్వహించిన అద్భుత నాటకము. "కరము చేతబట్టి మెల్లగా ముందుకు నడుగులిడుచు, త్రోవచూపరా హరా తొలగిపోకురా." జీవిత మాయా నాటకంలో మనం స్థిరంగా సాగగలమా, ప్రభుని సహాయం ఉంటే తప్ప. "ఆపదలనుండి రకించటం కాదు, విపరీత ప్రవర్తన నుండి మనలను మరలించి, దైవమార్గంలో నడిపించటం," అదీ ప్రభువు నుండి మనకు కావలసిన మార్గదర్శకం.

నన్ను ఆవిధంగా కాపాడుతూ వచ్చినందుకు ప్రభువుకు శతకోటి కృతజ్ఞతాపూర్వక వందనములు.

కుసుమహర
సేపూరి హరగోపాల్

ఇక్కడ రెండు విషయాలు చెప్పదలుచుకున్నాను.

1. మేము బొంబాయిలో పర్యటిస్తున్నపుడు, నగర దర్శనం కొరకు మా అధ్యాపకుడు మాకు ఒక రోజు శెలవు ఇచ్చాడు. కొందరు సినిమాలకు, కొందరు షికార్లకు వెళ్ళిపోయారు. నేను నేరుగా మలబార్ హిల్స్‌లో ఉన్న విమలమ్మ భగవాన్ దాసుల భవనానికి వెళ్ళాను. పనిమనిషి

నన్ను కుర్చీలో కూర్చొనమని చెప్పి అమ్మకు తెలుపడానికి పైకి వెళ్ళింది. భగవాన్ దాస్ బాబా, విమలమ్మ దిగి వచ్చారు. ఒక భక్తురాలి భర్త మరణించినందున ఆమెను ఓదార్చటానికి అమ్మ వెళ్ళుతున్నట్లు తెలిపింది. నాకు టీ, బిస్కెట్లు ఇచ్చింది. నా టూర్ సంగతి అమ్మకు విన్నవించాను. టాటా నగర్‌లో హెచ్.వి.రావ్‌ను కలుసుకొనమని అమ్మ నాకు సలహా ఇచ్చింది. తరువాత వారివద్ద శెలవు తీసుకొనడానికి బాబా అమ్మ పాదాలకు ప్రణామం చేశాను. నేత్రయుగళి నుండి ధారధారగా అశ్రువులు ప్రవహిస్తున్నాయి. విమలమ్మ నా బుగ్గలను తన కుడి  చేతితో నొక్కి ఆ చేతిని ముద్దుపెట్టుకున్నది, చిన్న పిల్లవాణ్ణి ముచ్చట పడేలాగు. కమలం బాబా ఫోటోలో  కుసుమమ్మ అభయహస్తం చూపుతున్నలాగ విమలమ్మ అభయహస్తం చూపుతూ అమ్మ లాగే నిలబడింది. ఇదీ సత్పురుషుల ప్రభావం. భక్తులు ప్రతి సంవత్సరం చైతన్య మహాప్రభువును దర్శించటానికి పూరీకి వెళ్ళేవారు, ఆదేశమివ్వమని ప్రార్థించేవారు. ఒక సంవత్సరం మహాప్రభువు చెప్పాడు, "నామ రుచి, భూతదయ, వైష్ణవ సేవ" అచరించమని. మరుసటి సంవత్సరం కులీన్ గ్రామము నుండి ఒక భక్తుడు ప్రశ్నించాడు, "వైష్ణవుణ్ణి ఎలా గుర్తించటం" అని. మహాప్రభువు చెప్పాడు, "ఎవరిని చూడగానే నీ నోటినుండి  కృష్ణనామం వెడలుతుందో అతడే వైష్ణవుడని గుర్తించు," అని. మహాపురుషులను గురించి చాటనక్కరలేదు. మన మీద వారినుండి కలిగే ప్రభావాన్ని బట్టి వారిని మనం గుర్తించ వచ్చు. విమలమ్మ అసమాన భక్తురాలు అని అనడానికి నాకు వేరే నిదర్శనం అక్కర లేదు.

2. మేము టాటా నగరం చేరుకున్న తరువాత నేను నేరుగా హెచ్.వి.రావు ఇంటికి వెళ్ళాను. ఆయన భార్య జానకమ్మ నాకు కాఫీ ఇచ్చింది. సాయంత్రం వారింటిలో భజన కార్యక్రమానికి రమ్మని నాతో చెప్పారు. సాయంత్రం వారింటికి వెళ్ళాను. భజన "భక్తజనార్చిత పాదసరోజం" పాటతో ప్రారంభమయింది. అంతే నేను పరవశించి పోయాను. (పాడమని నన్నడగవలెనా పరవశించి పాడనా, అని సుశీల పాడిన పాట గుర్తుకు వస్తున్నది.) నేత్రయుగళి నుండి అశ్రువులు ధారధారగా ప్రవహించాయి. ఆహా ఆ ఆనందము వర్ణనాతీతము. ఆ విధంగా ప్రభువు నన్ను అనుగ్రహిస్తూ వచ్చాడు. ఆయన యొక్క కరుణాకిరణం మన మీద ప్రసారించాలే కాని మన వల్ల ఏదీ సాధ్యం కాదు. ఇదీ నా అనుభవం.

సమాప్తం.

సర్వము ప్రభుని అనుగ్రహం మీద ఆధారపడి ఉందని చాటుతున్న దివ్య అనుభవాలు ఇవి. మన కర్తవ్యం నామం చేయుటమే. ఒక భక్తుడు వాపోయాడు, "నాకు నామం మీద మనస్సు వెళ్ళటం లేదే" అని. అది దురదృష్టం; దీర్ఘవ్యాధి లక్షణం. ఆకలి లేనివాడు ఆకలి పుట్టించటం కొరకు ఔషధాలు సేవిస్తాడు కదా! మరి నామరుచిని పుట్టించగల ఔషధం భక్తుల సాంగత్యం. నారదుడు వ్యాసునితో చెప్పాడు కదా, తాను పూర్వకల్పంలో దాసీపుత్రుడని, చాతుర్మాస్యం ఆచరించటానికి వచ్చిన మునులకు దాస్యం చేశాడనీ, వారి

ఉచ్ఛిష్టం భుజించాడనీ, అందువల్ల అతనికి హరికృప లభించిందనీ. దైవమందు రుచి కలగాలి; ఆకలి పుట్టాలి. ఆ మీదట అంతా సుముఖమే. ఏమీ చేతకాకపోతే ప్రభువునే ప్రార్థించాలి; వేరే అడ్డుదార్లు లేవు.

02.02.2013

చిరంజీవి కృష్ణచైతన్యకు ప్రేమాశీస్సులలో,

"ప్రభువు ఎన్నుకున్నాడు కాబట్టి మనం వేరే ఏమీ చేయనక్కరలేదా, నామం కూడా చేయనక్కరలేదా?" అని నీవు వేసిన ప్రశ్నకు నేను సమాధానం పంపించాను. అయితే ఈ ప్రశ్నకు మూలమేమిటి అని నా మనస్సు ఆలోచించ సాగింది. నా అభిప్రాయం తెలుపుతున్నాను. ఈ ప్రశ్న కూడా **hypothetic** గానే ఉంది, ఎందు కంటె మనకు ఆలాంటి ఉద్దేశ్యం లేదు కదా, మనకు వర్తించదు కదా? అంటే ఈ ప్రశ్న మనకొరకు కాదు, అన్యుల కొరకు అని సూచిస్తున్నది. మనం వేసే ప్రశ్నలన్నీ హెచ్చుగా ఇతరులకు వర్తించేవిగా ఉన్నాయి. నాకు ఏమనిపిస్తున్నదంటే, మనం ఇతరుల గురించే ఎక్కువగా ఆలోచిస్తున్నామని. ఇతరుల మేలు గురించి చింతించటం మంచిదే, అయితే మొదట మనం మనల్ని రక్షించుకోవాలి. ఈ రక్షణ ఎంత సఫలంగా ఉందని మనం చేసే సాధననే పరిమాణంగానూ, ప్రమాణంగానూ ఉంటుంది. దైవ **సహకారానికి** నామ జపాన్ని సాధనగా భగవంతుడు ఏర్పాటు చేశాడు. మనకు .అవతారాల మూలంగా, పురాణాల మూలంగా, మహాత్ముల మూలంగా తెలియ జేశాడు. కాబట్టి నామజపంలో కొరత లేకుంటే ఎన్ని పల్టీలు కొట్టినా పరవాలేదు. నామ జపమే ప్రాణాధారం

నేనిచ్చే సమాధానాలు నా వివేకం మూలంగా కలిగేవి కావు. దైవ సంబంధంతో జత చేయటం వల్ల సంభవిస్తున్న సమాధానాలు ఇవి. అందరూ ఈవిధంగా ప్రయత్నించవచ్చు. భగవంతునితో ప్రారంభిస్తే అంతా సాధకంగా ఉంటుంది, సృష్టి తోనో, మానవునితోనో జతచేస్తే అవకతవకలుగా ఉంటుంది. కృపాళుమహరాజ్ రచించిన "ప్రేమరస సిద్ధాంతం" పుస్తకం చదువుతుంటే నాలో ఒక తలంపు మెదిలింది. దాని పర్యవసానంగా సంభవించిన వ్యాసాన్ని క్రింద తెలిపాను.

**“29.01.2013**

## ఆధ్యాత్మికము, భౌతికము

నాకు కృపాళు మహారాజ్ అంటే మిక్కిలి ఆకర్షణ, ఎందుకంటె ఆయన మిక్కిలి సరళ స్వభావుడు, భక్తపుంగవుడు, సర్వశాస్త్ర కోవిదుడు.

ఆయన రచించిన ప్రేమరససిద్ధాంతాన్ని చదవటానికి ప్రయత్నించాను. ఆయన ప్రేమ తత్త్వ పరిధిలో వ్యాఖ్యానం చేసినంత వరకు అద్భుతంగానే ఉంది. కానీ, శాస్త్రవేత్త చేసే సిద్ధాంతము అయుక్తమని నిర్ధారణ చేసే ప్రయత్నం సముచితంగా అగుపించటం లేదు. శాస్త్రవేత్త యొక్క భౌతిక సిద్ధాంతాన్ని కొట్టివేయడానికి లేదు. దానిని ఎవరైనా పరీక్షించి ఋజువు చేయవచ్చును. అయితే తత్త్వ నిర్ధారణ ఆవిధంగా శక్యం కాదు, ఎందుకంటె అది మానవ గ్రాహ్యానికి అతీతంగా ఉంది కాబట్టి. కాబట్టి శాస్త్రవేత్త యొక్క సిద్ధాంతం నిజమయినదే, కానీ ఆయన సృష్టిని గురించి చేసే తీర్పుకు ఆధారం లేదు, ఎందుకంటె అవధులు లేని అనంత ఆకాశంలో మనము, గ్రహాలు, తారలు, సృష్టి సర్వం

ఎలా ప్రేలాడుతూ ఉందని గ్రాహ్యం సాధ్యం కాదు కాబట్టి. పంచేంద్రియాల మీద ఆధారపడి ఉన్న మనస్సు భౌతికసిద్ధాంతం వరకే పరిమితం. ఆధ్యాత్మికం మనస్సు యొక్క పరిధిలో లేదు.

పురాణాలు, శాస్త్రాలు మనిషి యొక్క విశ్వాసం కొరకు తెలుప బడ్డాయి. వాటి మూలం యొక్క నిర్ధారణ సాధ్యం కాదు. వాటి లోని సిద్ధాంతాలను భౌతికసిద్ధాంతాలతో పోల్చకూడదు. అలా పోల్చటం వల్లే ఘర్షణ ప్రారంభమవుతున్నది. పురాణాలకు భౌతిక ఆధారం లేదు. ఆయితే అవి పుక్కిటిపురాణాలు కావు. ఎందుకంటే వాటిలో ఇచ్చిన సూచనలను పాటించి దివ్యానుభవములు పొందిన ఉపమానాలు అనేకం ఉన్నాయి. మహామహా రాజులు కూడా కౌపీన ధారులయిన ఋషుల పాదాల మ్రోల సాష్టాంగభూయిష్టులయ్యారు. భౌతికము, ఆధ్యాత్మికము సమాంతరమైన సిద్ధాంతాలు, సమన్వయం కుదరదు, ప్రయత్నించటం హాస్యాస్పదం. భిన్నగుణసిద్ధాంతాలకు సమన్వయం ఎలా కుదురుతుంది, కుదరదు.

## ఒక సంవాదన:

**వ్యక్తి:** దేవుడున్నాడా?

**సమాధానం:** మీకు ఎలాటి సమాధానం కావాలి? భౌతికంగానా, ఆధ్యాత్మికం.గానా?

**వ్యక్తి:** నాకు భౌతికంగానే సమాధానం కావాలి.

**సమాధానం:** అంతరిక్షంలోకి రాకెట్లను పంపించే సామర్థ్యం పొంది ఉన్నారు, మీరు కాదు లెండి, సైన్టిస్టులు. సైన్టిస్టులు చేసిన ప్రయోగాలు మీకు అర్థంకావు. మీకు అర్థం కానివి కోకొల్లలుగా ఉన్నాయి. ఆకాశంలో తారలు అనంతంగా ఉన్నాయి, చీకటి గుహలున్నాయని సైన్టిస్టులు చెబుతున్నారు. ఆకాశంలో (శూన్యంలో) బ్రహ్మాండం ఎలా ప్రేలాడుతూ ఉందని సైన్టిస్తులు ఇంకా తీర్మానం చేయలేదు. వారు ఇవన్నీ తీర్మానం చేయగలిగిన నాడు, భగవంతుని ఉనికిని కూడ భౌతిక శాస్త్రరీత్యా తీర్మానం చేయగలరు. కాబట్టి మీరు ఈ సమాధానం సైన్టిస్టుల మూలంగా మాత్రమే పొందగలరు. (ఏప్పుడో?)

**ప్రశ్న:** అయితే నాకు ఆధ్యాత్మికంగానే సమాధానం ఇవ్వండి.

**సమాధానం:** దీనికి రామకృష్ణ పరమహంస జీవితంనుండి ఒక సంఘటనను మననం చేసుకోవాలి. ఒక భక్తుడు ఆయన్ని పదేపదే అడిగేవాడు, తనకు భగవంతుణ్ణి చూపించమని. ఒక రోజు రామకృష్ణపరమహంస అతనితో కలిసి నదీస్నానానికి వెళ్ళాడు. ఆ భక్తుడు నీటిలో తలను ముంచగానే రామకృష్ణ పరమహంస అతని తలను గట్టిగా నొక్కి పట్టుకున్నాడు. ఒక నిమిషం తరువాత వదలి పెట్టాడు. ఆ భక్తుడు నీటి నుండి తలను పైకెత్తి పెద్దగా శ్వాసను పీల్చాడు. రామకృష్ణపరమహంస ప్రశ్నించాడు, ఎలా ఉండిందని. భక్తుడు చెప్పాడు, శ్వాస ఆడనందువల్ల ప్రాణం కొట్టుకలాడింది అని. రామకృష్ణపరమహంస చెప్పాడు, "భగవంతుణ్ణి దర్శించటానికి (తెలుసుకొనడానికి) నీకు అలాటి భావం (ప్రాణం నిలువదనే భావం) కలిగితే నీవు భగవంతుణ్ణి తప్పక

దర్శించగలవు," అని. దేవుడున్నాడా లేడా అనే ప్రశ్నకు ఆవిధంగా మాత్రమే సమాధానం పొందగలం.

**వ్యక్తి:** నేను భౌతికస్థితిలోకదా ఉన్నాను, మీరిచ్చిన సమాధానం పొందుగా లేదే!

**సమాధానం:** ఇక్కడ రెండు సవరణలు. మొదటిది, మీరు భౌతికస్థితిలో ఉన్నారని ఎవరన్నారు? "నాకు లడ్డు అంటే ప్రియము," అని అంటే, అది భౌతికమా?

**వ్యక్తి:** అది మానసికము.

**సమాధానం:** మానసికంగా లడ్డును తయారు చేయగలరా?

**వ్యక్తి:** అది ఎలా సాధ్యమవుతుంది? దానికి వస్తువులు కావాలి.

**సమాధానం:** ఇదీ అంతే. ఏవిధంగా గణితశాస్త్రం, సాంఘికశాస్త్రం పేరు పేరో, ఆధ్యాత్మికం పేరు, భౌతికం–మానసికం పేరు. ఈ రెండింటికీ సమన్వయం కుదరదు.

భౌతికం మవస్సుకు సంబంధించింది, ఆధాత్మికం విశ్వాసానికి సంబంధించింది. వీటికి పొందిక ఎలా కుదురుతుంది? భౌతిక శాస్త్రజ్ఞుడు అణుశక్తి ఎలా వ్యవహరిస్తుందని తెలుసుకోగలడు, దానిని ఎలా ఉపయోగించవచ్చని తెలుసుకోగలడు, కాని అణువు ఎలా ఉందని భౌతికంగా చూడ లేడు. అలాగే విద్యుచ్ఛక్తిని అనుభవించగలడు, కాని చూడలేడు. మానవుడు పరిమితస్టితిలో ఉన్నాడు, తాను సృష్టిలోకి ఎలా వచ్చాడు, ఎక్కడికి నిష్క్రమిస్తున్నాడు అన్న విషయాలను కూడా తెలుసుకోలేకున్నాడు.

**ప్రశ్న:** అయితే భౌతిక స్థితిలో ఉన్న మనకు ఆధ్యాత్మిక విషయాలు ఎలా బోధపడగలవు?

**సమాధానం:** ఇందుకు ప్రయోజనపడే ఒకే మార్గం విశ్వాసం. విశ్వాసం అనేది మానసిక నమ్మకం కాదు. ఒకరు గాలిలో తేలగలిగారు, గాలినుండి వస్తువులను సృష్టించ గలిగారు – ఇలాంటి వాటితో విశ్వాసం స్థిరపడదు. విశ్వాసం దైవానుగ్రహంతో కలుగుతుంది. కలియుగంలో దైవానుగ్రహానికి మార్గం నామగానమని పురాణాలు నిర్వచించాయి, భూమిలో అవతరించిన మహాత్ములు ఆ మార్గాన్ని అనుసరించి పురాణనిర్వచనాలను మనకు ఋజువు చేసి చూపించారు.

**ప్రశ్న:** పురాణాలలో విభిన్న ఆదేశాలు అగుపిస్తున్నాయికదా? మరి ఏ పురాణం ఆధారమయినదని నిర్ణయించగలం?

**సమాధానం:** పురాణాలలో ఎంతైనా శ్వేచ్ఛకు ఆవకాశం ఉంది. ఆయా పురాణాలను అనుసరించిన వారు అనుభవం పొంది ఉన్నారు కదా! అంటే ఏ పురాణాన్ని అనుసరించినా, అనుభవం పొందగలం అని అవగతమవుతున్నది. అందుకే అన్ని మార్గాలు దైవం వద్దకు చేరుకుంటాయని చెప్పబడింది.

**ముగింపు:** మనం ముఖ్యంగా చేపట్టవలసిన జానం ఏమిటంటే ఆధ్యాత్మికం పేరు, ప్రాపంచికం పేరు. ఈ రెండింటికీ సమన్వయం కుదరదు. భగవంతుని యందు విశ్వాసం నెలకొన్న తరువాత ప్రాపంచికాన్ని భగవంతుని పరంగానే చూడాలి. ప్రభువు విమలమ్మకు ఏమని వ్రాశాడు, 'ప్రపంచమంటే ఎందుకమ్మా నీకంత విసుగు. ప్రపంచం నీది కాదుకదా!

అది నీ శ్రీకృష్ణునికి చెందినది. కృష్ణుణ్ణి ప్రేమించేటట్లయితే, ఆయనకు చెందిన వాటినీ ప్రేమించాలి.' జీవితాన్ని కృతార్థం చేయటానికి ఈ ఒక్క సందేశం చాలు."

నీ అభిప్రాయాలను తెలుపుతూ ఉండు, అవి నాలో ఉత్సాహాన్ని కలుగ జేస్తున్నాయి. ఈ వ్యాసాల ఉపయోగమేమిటని నాకు తెలియకపోయినప్పటికీ, వాటిని నేను అప్పుడప్పుడు చదువుకొని ఆనందిస్తుంటాను, ఎందుకంటె ఇవన్నీ భగవంతుణ్ణి గురిచిన ఆధ్యాత్మిక విషయాలు కాబట్టి. భగవంతుడు ముఖ్యం, తక్కినవన్నీ ఉపాధులు మాత్రమే.

సేపూరి హరగోపాల్

జ్ఞ జ్ఞా జ్ఞు ) ా క్ష క్షి క్షీ క్షు క్షే క్షో